8. పురాతనసాంఘికపరిస్థితులు—శ్రీమాడ్కిళాంబి రంగాచార్యులు వారు రచించినది. ఇందు వీరు పురాతనకాలములోని సాంఘికమతపరిస్థితులను బహుపురాతనగ్రంథపరిశీలనమున శ్రమసాధ్యమైనవిషయములను సమకూర్చిరి. పూర్వము బ్రాహ్మణుల గౌరవాధికము, క్షత్త్రియులయాధిపత్యము, బౌద్ధమతప్రచారము, జాతకకథలలోనివిషయములు, నిందుఁ జెప్పఁబడినవి. ఒక్కటేమి పురాతనవిషయము లసంఖ్యాకము లిందుఁగలవు. చదువఁదగినది. విషయమువశ్యమును గ్రహింపఁదగినదియును. పూర్వము హిందువులలో నున్నవర్ణములం గూర్చి పాశ్చాత్యవిద్వాంసులలో సర్ డా జన్ ఇబ్బెట్ సను, సెనా, నెస్ఫీల్డు, రిస్లీ మొదలగువారు గావించిన సిద్ధాంతము లిందుఁ గలవు. అంబట్ఠసుత్తము, వాసెట్ఠసుత్తము, అస్సలాయనసుత్తము, మధురసుత్తము మొదలగుపాళీభాషలోని వర్ణసంబంధసూత్రములు కొన్ని యిందుఁ దెల్పఁబడినవి. పూర్వపుమన్వాదిధర్మశాస్త్రములు, జాతకగ్రంథములు- మొదలగువానియందుఁ జెప్పఁబడిన విషయములే కాని నూతనవర్ణసిద్ధాంతములు గాని వర్ణచారిత్రముకాని యిందు లేను. శైలికిని విషయమునకును గొన్నిపంక్తులు—

"దేశములో బౌద్ధమతము వ్యాపించినతరువాతను దత్పూర్వమునవలె వర్ణములు సుస్థిరములై యుండి బుద్ధుఁడనతారచుత్రినటించకనైరము సంఘనిర్మాణమేమి యు మార్పుఁజెందక యే యుండెను. అతిపురాతనపాళీవైదిక గ్రంథములలో విభాగానుసంధానంబులకు గనుచున్నారము. ఇంతియ కాక నవీనములగు జాతకవ్యాఖ్యానములలో సైతము దేశమున బౌద్ధమతము ప్రబలియుండి మోక్షసంపాదనములో వర్ణము నిష్ప్రయోజనమను బౌద్ధసిద్ధాంతము ప్రజలయంగీకారమును బడసినపిదపను, వర్ణవిభాగముల బలము క్షీణింపక మెప్పటివలెనె యుండెను"- 86 పుట.

దీనికి వెల వేయఁబడి యుండలేదు. ఈరంగాచార్యులువారివి బృహస్పతి అర్థశాస్త్రము, బుద్ధఘోషునిజీవితచారిత్రము. జాతకకథలు 1.2 భాగములుం గలవు. విజయనగరముగ్రంథకర్తగారికి పేర వ్రాసి తెప్పించుకొనవచ్చును.

శ్రీరస్తు.

# షోడశకుమారచరిత్రము.

## సప్తమాశ్వాసము.

---

క. శ్రీ భార్గవకామందక, నైభావనవాపధార్య నాసవమంత్రి
ప్రాభవవిడంబధీగుణ, శోభితషాడ్గుణ్య యున్నసూరవరేణ్యా. ౧

చ. ఎదురుగ వచ్చి కాంచు ధరణీశుల రాజ్యము లిచ్చి నిల్పుచు
న్మదమున మాఱుకొన్న నృపమండలి నింద్రునిపీటి కంచుచుం
బదవులు మార్చి దుర్నృపుల బంధనశాలలఁ బెట్టఁ బంచుచు
న్విదితబలాఢ్యుఁ డానృపుఁడు విస్రుతలీలల వాలుచున్నెడన్. ౨

గీ. పుత్రవర్ధన మనియెడు పురమురాజు
గాన రాఁడు దేవర నతిగర్వి యనుచుఁ
జారు లెఱిఁగింప నధికరోషమునఁ గదలి
వీఁకఁ జని యప్పురమువిూఁద విడియుటయును. 3

క. అరదంబు లెక్కి యుద్ధులఁ
బురము వెడలి వీఁక వచ్చి భూమి యద్రువ ను
ద్ధురగతి నార్చుచు బలములఁ
బొరిగొనఁ దొడఁగుటయు విని విభుండలుక నెయిన్. ౪

వ. అయ్యిరువురం బరాజితులం జేసి పట్టితెండని చండబలు లగు తనమంత్రులం బంచినం బనిపూని వారు సన్నద్ధులై తేరులు దోలుకొని యాశూరులం జేర నరిగి చూచి యయ్యిరువురను దమదృఢముష్టియు దీర్ఘబాహుండును నైనం బరమానందంబు నొందునంత నాభిమథటాదులుం గని యుల్లంబున నుల్లసిల్లి. ౫

— దృఢముష్టిదీర్ఘబాహులకథ. —

క. వారిరువురు సంభ్రమమునఁ, దేరులు డిగఁగా రథావతీర్ణులయిన వే
వారండఱు నమ్మంత్రులుఁ, జేరియుఁ బరిరంభణంబు చేసి ముదమునన్. ౬

వ. భూపాలుపాలికిం గొనిచనిన నవ్విభుండు దవ్వులనే యామంత్రులం గని యా
మోదంబున నెదురుచని తత్ప్రణామంబు లాదరించి యెత్తి యిరువుర నొక్క
కౌఁగిటం జేర్చి గౌరవించి యుచితాసనంబుల నుండ నియోగించి సింహా

సనాసీనుం డై తదీయవదనంబులం జూడ్కి నిలిపి మీ రెచ్చటం జరియించి
యిప్పురంబున కరుగుదెంచితి రని యడిగిన దీర్ఘబాహుండు కరకమలంబు
లు మొగిడ్చి. ౭

గీ. వింధ్యమున నేను మిత్రుల వెదకఁ బూని
పెక్కుభూములఁ జరియించి యొక్కనాఁడు
వరవిభవరమ్య మైనట్టి పురముఁ జొచ్చి
యం దొకమహీసురునియింటి కరుగుటయును. ౮

వ. ఆయింటి ముదుసలి శోకవ్యాకులయై యుండి నన్ను నాలోకించి. ౯

శా. ఓయన్నా ! జముపీటికిం బయనమై యున్నాఁడు నా పట్టి నా
కాయం బుద్ధురవేదన న్నిలువ దింక న్నాధనం బేల (పో
పేయంచున్) నెలుఁగెత్తి యేడ్చుటయు నిర్వేదంబునం బొంది యే
నాయంబం గృపఁ జేరి కన్నుఁగవనీ రందంద చేనొత్తుచున్. ౧౦

వ. తత్పుత్రమరణోద్యోగంబునకుం గారణం బేమి యని యడిగిన. ౧౧

సీ. ఈవీటిరా జగుదేవసేను తనూజ దుష్టలబ్ధాఖ్య యద్భుతవిలాస
సంపూర్ణయౌవనోజ్జ్వల పురిఁ గలయట్టి కొమరుల నిచ్చ యొక్కరునిఁగాఁగ
బలిమి నై నయ్యింతి పిలిపించికొను నందుఁ బోయినవా రెల్లఁ బొలిసిపోవ
నింతకుమున్న యనేకులు చనిరి నావరతనూజాతునివరున నేఁడు
దీని వల దని మాన్పంగ దిక్కు లేదు
నింతతోడ మాసంసార మెల్లఁ దీఱె
ననుచుఁ గ్రమ్మఱ నెలుఁగెత్తి యడలుటయును
నభయహస్తంబు నిచ్చి యి ట్లంటి నేను. ౧౨

క. నీకొడుకుఁ గాదె యీరే, యాకన్నియపాలి కేన యరిగెద నింకన్
శోకంబు మాని నెమ్మన, నాకులగతి నుండవమ్మ యని పలుకుటయున్. ౧౩

క. ఓహో యి ట్లనఁ దగునే, దేహము వడ నుడుగు సుతుఁడు దీవనవగ ము
న్నోహమున నిన్నుఁ బంచిన, యాహత్య దొరంగునయ్య యన్నిభవములన్. ౧౪

ఉ. ఎవ్వరి నేమి చేసితినొ యేఁ దొలుబామున నాకుమారకుం
డివ్విధిఁ బోయెడుం గొడుక యీజననంబున నింక నేటికిన్
నొవ్వ రొకొనర్ప నోడుదుఁ దనూజుని కై నిను సద్గుణాఢ్యు నే
నెవ్విధిఁ జావఁ బంతు ధన మిచ్చెదఁ గైకొను మన్న నావుడున్. ౧౫

క. లావున వెరవున గలుగుమ, నేవిజయుండ నెల్లకడ నరేంద్రతనయచేఁ
జావక జయింపనోపుదు, నావాక్యము నెమ్మనమున నమ్ముము జననీ. ౧౬

వ. అని యూరడించి బలికి నాఁటి నిశాసమయంబున రాజకన్యకాసదనంబున కరిగి రత్నదీపప్రభాశోభితం బైన తదంతరంబున నాకాంత హంసతూలికా తల్పంబున నున్నంత. ౧౭

క. తోలుకారు మెఱుంగు క్రైవడిఁ, బులుకడిగిన మరునిశరము పోలిక నత్యు
జ్జ్వలరత్నపుత్త్రికాకృతిఁ, బొలఁతుక దనుదెంచె నెనుపు పొంపిరివోవన్.

వ. అయ్యింతితోడన ఘోరాకారుం డగు నొక్కరక్కసుం డరుగుదెంచె నయ్యవసరంబున. ౧౯

చ. జలదముపొంత క్రొమ్మెఱుఁగుచాడ్పున శైలముఁ జేరియున్న పు
ష్పలతికభంగి రాహుకడఁ జంద్రసముజ్జ్వలలక్ష్మి శోభిల్లి న
య్యలఘునిశాటు క్రేవఁ జెలువారెడు నానతిఁ జూచి వానిదో
ర్బల మొక చీరికిం గొనక రాగముఁ గౌతుకముం దలిర్పఁగన్. ౨౦

క. తప్పక చూచుచు నుండఁగ, నప్పొలఁతియు నన్నుఁ గాంచి యనురాగముతో
ఱెప్పయిడక కనుఁగొనఁగా, నప్పుడు నామీఁదఁ గడఁగె నసుర యలుకనై.

క. సురవైరిఁ జూచి యేతును, గరములఁ గాసి వెలికి కమలాకరభూ
వరుబంట దీక్ష్ణబాహుఁడ, నురుతరముగ నన్నుఁ జూచి దొరి నిశాటా. ౨౨

గీ. అనిన దైత్యుండు తనయాగ్రహంబు విడిచి
యీవు కమలాకరుని బంటవేని నేను
నీదుకూరిమి చెలిమామ నిన్ను వెదక
నరుగుదెంచితి ననినఁ బ్రియంబునొంది. ౨౩

క. ఏమిత్రరూపుననుటయు, నీసుహితుండైనయట్టి దృఢముష్టికి నే
మామ నని చెప్పుటయు నే, నామోదతరంగితాంతరంగుఁడ నగుచున్. ౨౪

వ. అతం డేమికతంబున నీకు నల్లుం డయ్యె నిప్పు డెచ్చట నున్నవాఁడు చెప్పవయ్య యని యడిగినఁ దద్వృత్తాంతం బతనిచేత నేవిన్నదియు నేనుం గన్నదియును వివరించెద నాకర్ణింపుము. ౨౫

క. వంధ్యోద్యమఖిన్నతనై, వింధ్యాటవి నతఁడు మిమ్ము వెదకి తిరుగుచున్
సంధ్యాసమయంబునఁ ద, ద్వింధ్యనిలయగృహము చేరి విధి కడలుకతన్.

వ. విస్తారోదారంబైన యయ్యగారంబున నొక్కదిక్కున నర్ధరాత్రసమయంబున.

క. సాధకుఁ డొకరుం డొక బిం, బాధరిఁ గొనివచ్చి యేమి యర్థించెనొ య
మ్మాధవికి బలియొనర్చుట, కై ధృతిలే కడలఁ బట్టి కట్టి తెగువనై. ౨౮

క. కరవాల మెత్తుటయు మదిఁ, గరుణ వొడమ దానిఁ జూచి క్రక్కున నార్తో
ద్ధురుఁడనై బలువిడి నాతని, శిరము దునిమి దేవికి బలి చేసి వినతుఁడనై. ౨౯

క. అవనితలకట్లు లూడిచి, భావము వెలి వాయఁ బలికి పద్మనయన నీ
వే వానిసుతవు నిను నేఁ, డేవిధమునఁ దెచ్చె నాకు నెఱిఁగింపు మనన్. ౩౦

వ. భయసంభ్రమంబులు మనంబున ముప్పిరిగొన నప్పయోరుహలోచన నేను
మాణిక్యపురాధీశ్వరుండైన రత్నకేతుని తనూభవను రత్నప్రభ యనుదా
నను నేఁటి సంధ్యాసమయంబున మహోత్సేధం బగు సౌధాగ్రతలంబున
నిద్రింప నిద్దురాత్ముండు నన్ను నెత్తికొని తెచ్చి యిచ్చట నిట్లొనర్ప నిడికొని
యున్నవాఁ డింతలో నీవు నాపాలిభాగ్యదేవతవు వోలె వచ్చి నాప్రాణం
బులు గాచితివి, నీయధీనంబ నైతి నీచిత్తంబు కొలఁది నడవంగలదాన నని
విన్నవించిన నతండు. ౩౧

క. నిను దోడుకొనుచుఁ జని నీ, జనకున కొప్పించి యిచ్చెఁ జనియెద నని య
వ్వనజాయతలోచనఁ దో, డ్కొని తెలతెల వేగునంతకును బురి కరిగెన్. ౩౨

వ. అరిగి రాజమందిరద్వారంబున నిలిచి యాకాంత నంతఃపురంబులోపలికిం
బనిచిన శోకవేగంబున బలవించుచున్న తజ్జననీజనకులపాలికిం జని తన
వృత్తాంతం బంతయు నెఱింగించిన సంభ్రమించి. ౩౩

క. మనమున నత్యద్భుతమును, ఘనమోదము నుల్లసిల్లఁగా నవ్విభుఁ డా
తని దోడితెచ్చి గారవ, మొనయఁగ నగ్రాసనమున నిడికొని ప్రీతిన్. ౩౪

వ. తద్వృత్తాంతం బడిగి యతండు చెప్ప నంతయు నాకర్ణించి కులపౌరుషంబుల
నధికుంగా నెఱింగి యుల్లంబున నుల్లసిల్లి. ౩౫

గీ. ప్రాణదానం బొనంగితి వట్లగాన
నాసుతకు నీవ తగుప్రాణనాయకుండ
వఖిలగుణములయందు సత్యాధికుండ
వరుఁడు నీకంటెఁ గలఁడె యీవనజముఖికి. ౩౬

వ. కావున నీరాజవదన వరియించి నారాజ్యలక్ష్మికధ్యక్షుండ వై యుండు మని
యత్యంతప్రియపూర్వకముగాఁ బ్రార్థించిన. ౩౭

చ. సమయము గాదు నాకిపుడు శాశ్వతభోగము లందు మానవీ
రమణుని మిత్రవర్గము ధరాస్థలి నారసి కాంచి పిమ్మట
స్సముచితవృత్తి నీదువరనందనఁ బెండిలి సైయభీష్టభో
గముల సుఖింతు నే ననినఁ గ్రక్కున నాతఁడు వల్కు వేడుకన్. ౩౮

క. నానాదేశములకుఁ దగు, మానుసులం బనిచి సకలసమాజంబుల మీ
మానవపతి నరయించెద, దీనతకైఁ గుంది నీకుఁ దిరుగఁగ నేలా. ౩౯

వ. అని సన్నుతంబుగాఁ బలికి పలికినయట్ల వెరవరులగు భృత్యుల నానాదేశంబులకు నరయం బనిచి శుభలగ్నంబున నత్యంతవిభవంబునం దన కన్నియ వివాహం బొనరించి సకలసంపదలు నిచ్చిన నచ్చెలువతో నభిమత క్రీడావినోదంబులం దేలుచుండి యొక్కనాఁటినిశాసమయంబునం దత్ప్రాగ్వ కంఠంబున స్త్రీయార్తనాదంబు వీతెంచిన. ౪౦

క. దృఢముష్టి వెడలె ఖడ్గము, దృఢముష్టి సమర్చి దాని నెలుఁ గెఱుఁగుటకై
దృఢముగ బలవితరణపరి, వృఢుఁ డార్తులఁగావ నట్టివేళలఁ గడఁగున్. ౪౧

వ. ఇట్లు వెడలి చని యయ్యార్తనాదంబు సక్కటికి నరుగునప్పుడు. ౪౨

క. అలఘుతరదివ్యభూషలు, వెలుఁగంగా నోర్తు హృదయవేదన డోఁపం
బలుమాఱును నెలుఁగడరఁగఁ, బలవించుచు నతనిఁ గని ప్రబలదైన్యమునన్.

మ. నెఱిశే కోర్వనివారిమాటలకున్న నేఁ డారెకు లస్సతిం
గొఱతం బెట్టిరి దప్పిఁ దాలెఱుఁగకుం గొల్లందఱుం జాలఁ ద
త్తఱముం బొందెద యాజలం బొసఁగుచుండం బెక్కి నాకించుఁ బ
ల్కుఱు దుఃఖించుచు వేఁడినం గరుణ యాత్మం బర్వ ధైర్యంబునన్. ౪౪

గీ. నాభుజాశక్తి నీప్రాణనాయకునకు, నీకొసఁగుదుంచు నాకొల్లుఁ జేర నరిగి
యూఁతఁ జెక్కించుకొన మెలపడర నక్కి, మూఁపులందుఁ బదంబులు మోపి నిలిచి.

గీ. కొఱతిపై నున్నచోరుని విఱిచినమలఁ, బలలఖండంబు లిలమీఁదఁ బడినఁ జూచి
వెఱక రక్కసిగా మది నెఱఁగి యచటఁ, గదలిపోవక నిశ్చలహృదయుఁ డగుచు.

చ. సురుచిర దివ్యరత్నపరిశోభిత నూపురరమ్యమైన త
చ్చరణము వంటఁబట్టటయుఁ జయ్యనఁ దానది యూడిపోవుడుం
గరములఁ దత్పదాంగదము గ్రక్కునఁ జిక్కినఁ జూచి మెచ్చులం
బొరయుచు వేడ్కఁ బట్టుకొని పోయి నరేంద్రతనూజ కిచ్చినన్. ౪౭

క. మనుజులకు బ్రాఁతియగున, య్యనుపమ సౌమనసముఁ జూచి యయ్యింతి ప్రియం
బున దీనితోడియుండియు, యనుదారకొను భాగ్యమబ్బునో కో నాకనినన్.

వ. ఆతరుణీరత్నంబు కోరిక పారంబు నొందించుతలంపున నమ్మరునాఁటి యర్ధ
రాత్రసమయంబున నీసఖుండను ఖడ్గసహాయుండనై య శేతసదనంబున కరిగి
తదంతరంబున నల్లనల్లన వసియించుచు. ౫౧

క. వినుతాహారంబులఁ గ్రొ, వ్వినయం గలమనుజమాంస మిడెడి యుష్మం గవ
చ్చినవాఁడఁ గోసి యిచ్చెదఁ, గొనవలసినవారు వచ్చి కొనరో యనినన్.

క. అందియుఁ గోల్పడిపోయిన, ముందటి దానవి సభసమూహాముతో నిం
పొంద విని చేరఁగాఁ జని, మందరనగధీరు నాకొమరుఁ గని వేడ్కన్. ౫౨

వ. అన్నెలవునకు వినోదార్థంబు వచ్చి యుక్తియెడనున్న నాకడకుం బఱతెంచి.

క. మారాకారుఁడు మిక్కిలి, శూరుఁడు నగువాని కిత్తు సుత నని దెపుడున్
మారాకారుఁడు మిక్కిలి, శూరుఁడు నగువాఁడు గలిగెఁ జూపెదరమ్మా. ౫౩

వ. ఏను నిన్న నతని పౌరుషం బంతయుం జూచితి నని తద్వృత్తాంతంబు వివరించి
నేఁడును నన్ను బ్రమయించి కట్టి తోడియుండియుం బుచ్చుకొని పోవుతలం
పున వచ్చి తిరుగుచున్నవాఁ డని చెప్పిన నతనిం జేర నరిగి. ౫౪

శా. భూతప్రేతపిశాచరాక్షసగణాస్యాద్రిన్ జనశ్రేణికిన్
భీతింబర్వఁగఁ జేయు నిన్నెలవున న్భీమాంధకారంబున
న్వీతాతంకత నీవు ద్రిమ్మరుటకున్ డెందంబున న్మెచ్చి సం
ప్రీతిం బొందితి వేఁడు మిచ్చెదను మనోభీష్టంబుల న్నావుడున్. ౫౫

గీ. నిన్న నాకయుంబె చేకుఱ నిన్నెలవున, నాకు నీతోడియుండియునై కడంగి
యరుగుదెంచితి నిచటికయ్యుండెవాఁడు, నిచ్చట యభీష్టమనవుడు నిచ్చెనలరి.

క. వెనుకదెస నున్నదానవిఁ, గనుఁగొనుటయు నంబెవృచ్చి క్రమ్మఱ నా కి
చ్చిన నేనాలసికిఁ బ్రియం, బెనయంగా నిచ్చి ప్రీతి మెసకంజెనఁగన్. ౫౬

వ. ఏనకుగం దన బాల్యంబు మొదలుకొని నిన్నుఁ గన్నదితుదిగా నిజవృత్తాం
తం బంతయు నెఱింగించిన నీ చెలిమాటలకు మోదించి యమ్మేఁ జూచి యను
గుదు గాని రమ్మని మత్పురంబునకుం దోడ్కొనిపోయి మదీయంబు లగు సకల
సంపద్విభవంబులుం జూపి వివిధసంభావనంబు లొనరించి. ౫౭

చ. అవిరళకాంతికాంతనవయౌవనమూన విలాసభాసుర
యువతిలలామ నాతనయ నుత్సవమారఁగఁ బెండ్లి చేసిన

న్భవనమనోజ్ఞభోగములఁ బొందుచుఁ గొన్నిదినంబు లుండి భూ
ధవసుతపాలి కేగి ప్రమదంబున నందియ యిచ్చి మచ్చికన్. ౫౯

వ. అప్పుడు నచ్చపలనయన నిష్టోపభోగంబులం దేల్చి క్రమ్మఱ మత్పురంబున కరుదెంచి నిన్నుం బొడగను నుపాయంబు చింతించుచుండ నొక్కనాఁడు శుక్రశిష్యుండు మహామతి యను విప్రుండు మాసదనంబున కరుగుదెంచిన నతండు త్రికాలవేది యని యేనుం జెప్ప నీసఖుఁ డెఱింగి యతనికిం బ్రణమిల్లి మీ తెఱం గడిగిన నామహానుభావుండు నావదనం బవలోకించి. ౬౦

సీ. పుత్రవర్ధననామ పురము నేలెడురాజు తనకూఁతుఁ బరదేశమునకు నొసఁగఁ
జాలక యాసరోజాతలోచనఁ జూచి యిప్పరికొమరుల నల్లవరుస
నేకద కరుదేర నియమంబు చేసెద నందులో నీకొచ్చునట్టివాని
హృదయమెసఁగా వరియింపుము నీ వని నేఁడు చెప్పినవాఁడ నీవచటికిఁ
దీవ్రగతి నేగి దాని కద్భుతుండ వయి
రాత్రు లరుదెంచి తత్కుమారకుల నోలి
ననుదినంబు నాహారంబు గొనుచునుండు
మతని చెలి యొకఁ డొక్కనాఁ డరుగుదెంచు. ౬౧

వ. అతండు కేవలపురుషుండుగాఁడు గావున నీభావంబుం గనుంగొని పేరువాఁడి నిమిషాఁదం గలియునప్పుడు నీవృత్తాంతంబుఁ జెప్పి యిరువురం గూర్పుము నీవు గూర్చినవెనుకఁ గతిపయదినంబుల నీరుం దమరాజును తెలులం గలసెద రని పలికి నిజేచ్ఛ నరిగె నతనివచనప్రకారంబున నిన్నుం బొడగాంచి కృతార్థుండ నైతి నల్లి నీ నెచ్చెలి నిచ్చటికిం దోకొని వచ్చెద ననినం బరమానందభరిత మానసుండ నై యాదనుజపుంగవుం గవుంగిలించుకొని యతిరయంబునం దోడ్కొని రమ్మని పనిచిన నతండును పతిత్వరితగతిం జని తద్వృత్తాంతం బంతయు దృఢముష్టికిం జెప్పిన నద్భుతప్రమోదరసాయత్తచిత్తుండై నీకతంబున నానెచ్చెలివృత్తాంతం బంతయు నెఱింగితి నని యతని వినుతించి వివిధవస్తువాహనంబులతో నారక్షసుండు దోడ్కొనిపోవఁ బత్నీసమేతుండై పుత్రవర్ధననామనగరంబునకు వచ్చి నన్నుం గాంచి యన్యోన్యస్నేహపూర్వకంబుగా నాలింగన కుశలప్రశ్నాది విధానంబు లొనరించి దాని వరించి యభిమతక్రీడావినోదంబుల సుఖం బనుభవించుచుఁ గొన్నినాళ్ళుండునంత. ౬౨

క. పుత్రకులు లేమి నపుడా, ధాత్రీపతి రాజ్యభరముఁ దమయం దిడి న
స్మైత్రి దగ నునిచి పరమత, పిత్రత వని కరిగి నియమవిధి నర్తిల్లెన్. ౬౩

వ. మేమును భవద్దర్శనంబు గోరుచు నిందుండ మాభాగ్యవశంబున దేవరం
బొడగని కృతార్థుల మైతి మని విన్నవించుటయు నమ్మహీవల్లభుం డంత
సిల్లి వారల నుచితప్రకారంబున సంభావించి హంసావళియందలి యను
రాగంబునకు ననుగుణోద్యోగంబుగా దిగ్విజయయాత్రా నెపంబున విదిశా
పురంబున కరిగి తత్పురోద్యానంబున వేత్రవతీతీరంబున విడిసి మేఘమాల
మహీపాలునకుం దమరాక యెఱింగించి పుత్తెంచిన. ౬౪

గీ. అతఁడు సకలవస్తువితతులు కానుకగాఁ, గొనుచు నేగుదెంచి వినతుఁడగుచు
నానృపాలుఁ గాంచి యత్యంతబహుమాన, లీలఁ జెంది మైత్రి గీలుకొనఁగ.

వ. ఇష్టగోష్ఠీవినోదంబున నున్నయంత నమ్మహీకాంతునకు సంతసం బొడవఁ
తేజోవిభాకరుండగు ప్రభాకరుం డిట్లనియె. ౬౬

క. సీతనయను సర్వశుభా, స్వీతనయ నొసంగవలయు నీ నృపతికి ను
ద్యోతితకౌతుక మొదవ ను, హీతలవర యనుఁడు నానరేశ్వరుఁ డంతన్.

వ. సంతుష్టాంతరంగుండై యొంతయుం బెలివొంది వినయంబునం గరకమలంబులు
ముకుళించి యుంచితప్రియపూర్వకంబుగా నమ్మహీవల్లభున కిట్లనియె. ౬౮

క. హంసావళిలో నెల్లను, హంసావళిఁ బోలు దివ్యహాతేజమునన్
హంసావళికిని గవిజిత, హంసావళి కీవ తగిన యధిపతి వధిపా. ౬౯

క. ఆకన్యారత్నంబును, నీకేతగు దిక్కులందు నిఖిలంబున శు
శ్లోకుండవై వరింపుము, భాకరలగ్నమున నవ్వరానన నెమ్మిన్. ౭౦

వ. అని పలుకుటయుం బుడమిఱేని కొలువున నున్న మౌహూర్తికు లెల్లింటి
నిశాసమయంబున విశేషలగ్నంబు గల దని విన్నవించుటయు నుల్లసిల్లి
మేఘమాలధరణీవల్లభుండు నత్తెఱంగున కియ్యకొని సముచితప్రకారంబున
వీడ్కొని యరిగి యమ్మహోత్సవంబున కుత్సహించిన. ౭౧

క. తనరాకడ నవ్వార్తలు, విని హంసావళి కరంబు వేడుక నేఁ గొ
రినకమలాకరుఁడో యు, జ్జనపతి వే ఱొకఁడో యనుచు సంశయ మడరన్.

వ. తనచెలి యగు కమలమంజరి కేకతంబున ని ట్లనియె. ౭౩

క. మనభూపతి కమలాకరుఁ, డనునృపతికి నన్ను నిత్తుఁ ననినాఁడట యా
తనియున్న వేలమునకుఁ, జని లక్ష్యధ మెల్లఁ దెలిసి చనుదె మ్మనినన్. ౭౪

విధములై, గృహ్యతే=గ్రహింపఁబడును. దీని తాత్పర్యము, యరలవలు నాలుగును ద్వివిధములు. అందులో యవలకు "హలి సర్వేషాం" అనుసూత్రమునందు, పాణినీయములో లఘువులును, అలఘువులును నని రెండువిధములును సూచితము లయ్యెను. లకారము "లోశః" అనుసూత్రమునందు ప్రాకృతవ్యాకరణములో రెండువిధము లాయెను. పరిశేషించిన రవర్ణము, ఆంధ్రవ్యాకరణములో ద్వివిధ మవునను‌ట.

---

అద్యః క్రియాసు ధాతార్థోద్యోతిత* మాద్యగం వినా సర్వః
యశ్రుతి మార్యా లఘుయం ప్రవదన్తి ప్రాణతః పరం ప్రాణమ్. ౮

ఇది రెండుసూత్రములు. క్రియాసు=క్రియాపదములయందు, ధాతార్థోద్యోతితం=ధాతార్థములం గనిపించునవియు, ఆద్యగం=నామాది నుండునవియు, వినా=వినాగాను, సర్వః=సమస్తమైన, యః=యకారమును, అత్=అకారము. అకార మనఁగాఁ దలకట్టనుట. చనియె, వినియె మొదలైనవి క్రియాధాతార్థస్థితయెకారములు. యెద్దు, యెప్పుడు, మొదలైనవి నామాదినున్న యెకారములు. ఈరెండును విడిచిపెట్టి కడను యకారములెల్లఁ దలకట్టుగాఁ దెలియునది. ప్రాణతః=అచ్చుకంటెఁ బరమైన, ప్రాణం=అచ్చును, యశ్రుతిం=యకారముగా వినఁబడుదానిని, లఘుయం=లఘుయకారముగాను, ఆర్యాః=పెద్దలు, ప్రవదన్తి=పలుకుదురు. వారియధికుండు, మాయేలిక, మొదలైనవి లఘుయకారములు.

---

నాన్యేషాం వైధర్మ్యం లఘ్వలఘూనాం రయోస్తు నిత్యం స్యాత్
అర్థస్య స్తాలవ్యశ్చ రన్యక్రస్యాన్తిథ స్సువర్ణశ్చ. ౯

ఇది మూఁడుసూత్రములు. లఘ్వలఘూనాం=లఘ్వలఘువులైన, అన్యేషాం=కడమవానికి, వైధర్మ్యం=విరోధము, న=లేదు, రయోస్తు=లఘ్వలఘువులైన రవర్ణములకైన, నిత్యం స్యాత్=నిత్యముగా విరోధము గలదు. విరోధ మనఁగాఁ బదములో యతిప్రాసములు చెల్లకుండుట- ఇటనంగా యవలు ద్వివిధములును దెలుఁగునఁ గల వనుట. అచ్చుమీఁదను అచ్చునకు వచ్చినయకారము లఘుయకారము. ప్రథమాంతముమీఁద, వకారమునకు వచ్చిన యా

* ధాతార్థద్యోతినం-పా.

దేశవకారము లఘువకారము. లళలు ప్రసిద్ధములేను. వీనికి యథోచితముగా నుదాహరణములు: —

నీళ్లఁబాలునుగలసిన ట్లెల్లప్రొద్దు, నాయహో విభూమణుఁడు నీవుఁ బాయకుండు
రనుచుఁ జెలికత్తెపలుక హిమాచలాత్మ, భవ ముఖాబ్జంబు వంచి సిగ్గువడియుండె.

కొందఱు ద్వివిధములైన వకారములకును, తొల్లి మైత్రి లే దందురు.
ఇంక రవర్ణోదాహరణము: —

వెక్కలుగలట్టి పెనుబాఁవఱేండ్లవంటి, కలుకుములుకులశుంభునుక్కణఁగఁ జేసి
పరమకళ్యాణి గిరికులేశ్వరతనూజ, రణవినోదంబు సలిపె నిర్జరులు వొగడ.

దన్త్యః=దంత్యమైన, చుః=చవర్గము, అత్=అకారము, తాలవ్యః=తాలవ్యమైన, చుః=చవర్గము, వక్రః=ఎకారము, స్యాత్=అవును, మిథః సవర్ణశ్చ=దంత్యతాలవ్యములు రెండును, దమలోఁదాము, సవర్ణము లవును. చందురుఁడు, చక్కెర, జాడ, జంట మొదలైన దంత్యములు తలకట్లనుట. చెన్ను, చెల్వ, జెట్టి, జెత్తి, ఇవి మొదలైన తాలవ్యము లెత్వము లనుట- ఇందుకు దాహరణము: —

చక్కఁదనము లోకజయవైభవము వల, రాచవారువడసి రాచరించి
చెలువ నద్రికన్య సేవించువారికి, జాడఁగన్గొనఁగ నసాధ్యమెద్ది.*

---

ప్రాతిపదికం హి నామ ప్రత్యయ ఇహ వర్ణకః క్రియా ధాతుః
ప్రాణా స్సమాసతోఽచో బిన్దు రనుస్వార ఏచో వక్రః. ౧౦

ఇవి యాఱుసూత్రములు. ప్రాతిపదికం=శబ్దశాస్త్రప్రసిద్ధమైన ప్రాతిపదికము, నామ=నామ మనంబడును. ఇహ=ఈయాంధ్రవ్యాకరణమందు, ప్రత్యయః=ప్రత్యయము, వర్ణకః=వర్ణక మనంబడును, ధాతుః=ధాతువు, క్రియా=క్రియ యనంబడును, అచః=అచ్చులు, సమాసతః=సంగ్రహముచేత, ప్రాణాః=ప్రాణము లనంబడును, అనుస్వారః=అనుస్వారము, బిన్దుః=బిందువనంబడును, ఏచ్=ఏఓలు, వక్రః=వక్రము లనంబడును.

---

వక్రతమావైజ్ఞలస్య స్సమాసతః ప్రాణినో ద్రుతాఖ్యో నః
కచటతపాః పరుషాఖ్యా గజడదబాస్తు సరళాః స్థిరా ఇతరే. ౧౧

ఇవి యాఱుసూత్రములు. ఐచ్=ఐ ఔలు రెండును, వక్రతమః=

* కలుగుశుద్ధములెల్ల జెఱుకులేక-పా.

ప్రకృతములు లనంబడును, హలః=హల్లులు, సమాసతః=సంగ్రహముచేతను, ప్రాణినః=ప్రాణు లనుపేరు గలవి, స్యుః=అగును, నః=నకారము, ద్రుతాఖ్యః=ద్రుత మను పేరుగలది, కచటతపాః=ఈయైదును, పరుషాఖ్యాః=పరుషము లను పేరుగలవి, గజడదబాః=ఈయైదును, సరళాః=సరళము లనంబడును, ఇతరే=పరుషసరళములు పదియు వినాగాను గడమహల్లు లన్నియు, స్థిరాః=స్థిరములనఁబడును.

---

ఇన్ద్రాద్యా అపిచ గణా వళిరాద్య మనన్తరాక్షరం ప్రాసః

న పదా న్యవ్యయ సుప్తిఙ్క్త్వా తుమునా మనుకృతేస్తి వాక్యంతు. ౧౨

ఇవి నాలుగుసూత్రములు. గణాః=గణములు, ఇన్ద్రాద్యాః అపిచ=ఇంద్రచంద్రసూర్యు లనునవియుఁ గలవు, ఆద్యం=మొదటియక్షరము, వళిః=వళి యనంబడును, అనన్తరాక్షరం=రెండవయక్షరము, ప్రాసః=ప్రాస మనఁబడును, అవ్యయసుప్తిఙ్క్త్వాతుమునాం=అవ్యయమునకును, సుబంతమునకును, తిఙంతమునకును, క్త్వా ప్రత్యయాంతమునకును, తుమున్ ప్రత్యయాంతమునకును, పదాని=ప్రయోగపదములు, న=లేవు, అనుకృతేః=అనుకరించు చోటులనైన, వాక్యం=వాక్యము, అస్తి=కలదు. వాక్యశబ్దము పదమునకు నుపలక్షణము. దీనితాత్పర్యము-ప్రాంతః, అంతః, హరిణా, రామేణ, భవతి, అస్తి, కృత్వా, గంతుం, రంతుం, అను ప్రయోగములు తెనుఁగున లేవు. ఇవే యనుకరించి ప్రయోగించినఁ గలవు. అనుకరించుట యనఁగా, పద ముచ్చరించి తుదను "అని" అనుమాట ప్రయోగించుటయే. సాయం అని, హరిణా అని, కృత్వా అని, అనునవి యనుకారములు. ఈయవ్యయాదులైన యయింటికి, ననుకారములచేతఁ బ్రయోగమునకు నుదాహరణము చెప్పుచున్నాఁడు.

శా. మాతస్త్వే సతతం నమో యనుచు, నంబ త్వాం భజే యంచు, వం
దే తే పాదసరోజ మంచుఁ, బురతః స్థిత్వా మమ త్రాహి యం
చాతంకాల్ కుశలాసి హాస్త మనుచున్, హస్తంబుతోఁ బల్కుచున్
ఖ్యాత శ్రీపురుషార్థము ల్వడసెదం గా నేను గాత్యాయనీ.

---

తిఙ్తద్ధితశేషషష్ఠీసుప్కర్మప్రవచనీయజవిభక్తీః

కిఞ్చిత్ప్రశంసనాద్యాతసన్తాపయదాతదాకిమేవాంశ్చ. ౧౩

క్త్వాకిలతుమ్ష్టి మాద్యా నభిదధతి కలా ద్రుతో న యేషాం స్యాత్

అన్యే ద్రుతప్రకృతయో యే స్యు స్త్వనుజీవితద్రుతా నిత్యమ్. ౧౪

ఈయార్యాయుగళము రెండుసూత్రములు. తిఙర్థ్య=తిఙర్థ్యము ల
ను క్రియలును- ప్రబలితివి, సంతోషించితివి, ప్రకాశించిరి, సంతోషించితిమి-
ఇత్యాదిక్రియలు తిఙర్థ్య లనిపించుకొనును. శేషషష్ఠీ=చెక్కషష్ఠియు, హరి
చెక్క, గిరిచెక్క అనుషష్ఠియును, సుప్=వనము, వనములు, ఇత్యాది ప్రథ
మావిభక్తియును, కర్మప్రవచనీయజవిభక్తిః=రాముంగూర్చి, కృష్ణుంగూర్చి, ఇ
త్యాదిద్వితీయ యు, కించిత్=ఇంచుకంత, కాసంత, సుంత, మొదలైన కించి
దర్థములును, ప్రశంసన= బలి, మజ్జా మొదలైన ప్రశంసార్థములును, అద్భు
త=అహో, ఓహో, ఔరా, మొదలైన అద్భుతార్థములును, సన్తాప=అక్కట,
అయ్యో మొదలైన సంతాపార్థములును, యదా తదా=ఎప్పుడు, అప్పుడు,
అనెడివియు, కిం=ఏమి యనునదియు, ఏవాంశ్చ=నిన్నే, నన్నే, అను నేవార్థ
ములును, క్త్వ=ప్రకాశించి, హరించి, విహరించి, ఇత్యాది క్త్వప్రత్యయాంత
ములును, కిల= చేసి నట, అనెడి కిలార్థమును, తూష్ణీం=ఊరక, మిన్నక
మొదలైన తూష్ణీమర్థములును, ఆదిశబ్దముచేత, షష్టి యనువిభక్తియు మఱి,
సుమ్ము, కద, మొదలైనవియును, కలాః=కళ లని, అభిదధతి=చెప్పుదురు, ఏ
షాం=ఏవని కైన, స్రుతః=పైనకారము, నస్యాత్=లేదు. మూర్ఛిరి కీర్తి, హరిచెక్క
చరణములు, శివుండు కర్త, ఇత్యాది. వించున్నాము, ఘటింపంగలండు, చనండు,
అనెడివి తిఙర్థ్యములు గా నున్నను, ప్రథమాసమాసములు గనుక సుప్పులోని
వే గానే తెలియునది. సుప్ అంటే ప్రాకృతశాస్త్రవ్యవహారమునం బ్రథమా
విభక్తికిం బేరు. ఊరక, చేయక, అనునవి క్త్వప్రత్యయార్థములేను. మఱియుం
గ్రాందెనుంగున నేమైనా అంటే, ఆదిశబ్దము ఉన్నది గనుక కళాప్రదేశములుగాం
దెలియునది. అన్యే=ఈచెప్పినవానికంటె నన్య మైనవి యేవి గలవో యవి య
న్నియు, స్రుతప్రకృతయః=స్రుతప్రకృతు లనంబడును, యే=ఏవైన నేమి,
నిత్యం=నిత్యమును, అనుజీవిత=అనువర్తించుచున్న, స్రుతాః=నకారముగలవి,
స్యుః= అవును. సూత్రప్రాప్తులచేత లోపములు వచ్చిన వచ్చును గాని పొల్లు
నకారముతోంగూడ నుండును ననుట.

---

తజ్జా సమాచ దేశ్యా గ్రామ్యా చేయం చతుర్విధా భవతి
ప్రకృతిద్వయజా తజ్జా తుల్యాతు సమా ప్రవాహినీ దేశ్యా. ౧౫

ఇది యేకసూత్రము. ఇయం=ఈభాష, తజ్జా=తద్భవము, సమా=
తత్సమము, దేశ్యా=దేశ్యము, గ్రామ్యాచ=గ్రామ్యము నని, చతుర్విధా=నాలు
గువిధములుగలది, భవతి=అవుచున్నది, ప్రకృతిద్వయజా=సంస్కృతప్రాకృతము

లంబుట్టిన, తజ్జా=తద్భవము, తుల్యాతు=సంస్కృతప్రాకృతతుల్యమైన, సమా=తత్సమము, ప్రవాహినీ=లోకవ్యవహార(ప్రవాహ)సిద్ధమైనది, దేశ్యా=దేశీయము.“అనియమా ద్గ్రామ్యం” అని మొదలఁ జెప్పినాఁడు గనుక వర్ణన్యాసాధికతాన్యాదృశతమష్టమైనదే గ్రామ్యమని వాగనుశాసనులు తల్లక్షణముం జెప్పిరి.

---

విరళాః పేచోషాదికశబ్దాః ప్రవ్యాహరంతు* శబ్దజ్ఞాః
ఇహతు ప్రవ్యాహార్యం సత్కవితసుప్రసిద్ధ మేవ పదమ్. ౧౬

ఇది యోగసూత్రము. శబ్దజ్ఞాః=శాబ్దికులు, విరళాః=అప్రసిద్ధము లైన, పేచోషాదికశబ్దాః=పేచ ఊష మొదలైన శబ్దములను, ప్రవ్యాహరంతు=ప్రయోగింతురుగాక, ఇహతు=ఇందయిన, సత్కవితసుప్రసిద్ధం=కవిసమయసిద్ధమై ప్రసిద్ధమైనటువంటి, పదమేవ=పదమే, ప్రవ్యాహార్యం=ప్రయోగింపందగును. పేచ అనఁగా ‘డుపచిష్పాకే’ అను ధాతువునకు లిణ్మధ్యమపురుషబహువచనము. ఊష అనునది ‘వసనివాసే’ అను ధాతులిణ్మధ్యమబహువచనము. ఇవి మొదలైన శబ్దము లప్రయుక్తము లని నిషేధించియును వేదములలోఁ బ్రయోగించియున్నవి గనుక యప్రయుక్తములు గావని మహాభాష్యములో, “అస్త్యప్రయుక్తః”అను వార్తికమునొద్ద భాష్యకారులు, అన్నారు గనుక, అప్రసిద్ధము లైనను సంస్కృతములోనైనఁ బ్రయోగింపవచ్చును గాని యిం దప్రసిద్ధములు ప్రయోగింప వలదనుట. ఇట్లన్నందుచేతఁ బ్రయోగసిద్ధ మయినదైన గ్రామ్యమైనను యోగ్యమే యని వాగనుశాసనులు వివక్షించినాడు.

---

శా. బ్రహ్మారణ్యకమాండుకాద్యుపనిషద్వ్యాటీహంస యా
బ్రహ్మస్తంబచరాచరప్రకరయంత్రవ్యావిశేషకా†
జిహ్మాద్భ్రమణ‡సూత్రధారపిపితాసిప్రాతభీతామరా
బ్రహ్మణ్యాసహమానమానసపరబ్రహ్మస్వరూపాకృతీ.

ఇది శ్రీసకలభాషావాగనుశాసనసన్నయభట్టవిరచితాంధ్రశబ్దచింతామణియందు సకలకవితాస్వతంత్రభట్టారక మొలగూచి బాలసరస్వతీకవిమహోపాధ్యాయప్రణీతం బైనయాంధ్రశబ్దచింతామణి టీకాగ్రంథమునందుఁ బ్రథమమైన సంజ్ఞాపరిచ్ఛేదము.

---

* ప్రత్యాహార్యం అని కొందు ప్రతులలోను గలదు.

† విశేషణా. ‡ జిహ్మక్రీడన. పా.

# సన్ధిపరిచ్ఛేదము.

---

సన్ధి ర్నా చో ఽచ్యనుతో వా ఽతో ఽనాదిషు విభక్తి షూతో వా
నిత్య మనుత్తమపురుష క్రియా స్విత: పరమితౌ సమస్తానామ్. ౧

ఇది యయిదుసూత్రములు. సన్ధిః న అచః అచి అనుతః- అనుతః=ఉకార వ్యతిరిక్త మైన, అచః=అచ్చునకు, అచి=అచ్చు పరమగుచుండఁగా, సన్ధిః=సంధి, న=లేదు. ఉదా. మేనయత్త, చిన్నియన్న, వన్నెయొల్లె, రోయిూవి, మైయొలపు. ఉకారమునకు సంధి కలదు. ఇంపు + అగు నని యుండిన సంధి, ఇంపగు, సొంపగు; వా అతః- అతః=అకారమునకు, వా=వికల్పమున సంధి వచ్చును. వికల్ప మనఁగా రాను వచ్చును, రాకయు నుండును; అకారమునకుఁ బూర్వసూత్రమున సామాన్యాకారముచేత సంధిరాకపోఁగా వికల్పించినాఁడు. లెస్సయగు, లెస్సగు; ఎల్లయపుడు, ఎల్లపుడు. అనాదిషు విభక్తిషు ఉతః వా- అనాదిషు=ప్రథమావ్యతిరిక్తమైన, విభక్తిషు=విభక్తులయందు, ఉతః=ఉకారమునకు, వా=వికల్పమున సంధి గలదు. మమ్మునేలు, మాకొలకునిచ్చు, పీరునారోగ్యము, శ్రీయందునసురక్తి, ప్రతప్రకృతులు గనుక నకారము నిలిచినది. మమ్మేలు నిత్యాది. ప్రథమయం దైన- హరుఁ డధికుండు, హరిహాగు లాద్యులు, సంధివచ్చెను. ప్రతప్రకృతి కాదు గనుక నకారము లేదు. నిత్య మనుత్తమపురుష క్రియాసు ఇతః- అనుత్తమపురుష=ఉత్తమపురుషవ్యతిరిక్త మయిన, క్రియాసు=క్రియలయందలి, ఇతః=ఇకారమునకు, నిత్యం=నిత్యముగా సంధి గలదు. చనిరసురులు, ప్రోచిర మరులు. ఉత్తమపురుష మైన, కొలిచితి నంబను, విడిచితి మన్యులను, అన్నది కిమాది గనుక క్రియాగ్రహణమున నంటలేదు. నిత్యం అన్నాఁడు గనుక క్రియాగ్రహణ మనిత్యము. పరమితౌ సమస్తానాం- పరమితౌ=పరిమాణార్థము పరమై యుండిన, సమస్తానాం=అన్ని యచ్చులకు సంధి గలదు. బారెండు, పుట్టెండు, తూమెండు, పీసెఁడు, ఇత్యాది.

---

న స్యా త్తద్ధర్మోత శ్చే ర్వా స్యా ద్వర్తమానవిహితస్య
తద్వ త్తదాదిజస్య ప్రాయస్తు స్యా త్త్రిమాదికే ష్వితః. ౨

ఇది నాలుగు సూత్రములు. తద్ధర్మోతః-తద్ధర్మ=క్రియలయొక్క తద్ధర్మార్థ మందలి, ఉతః=ఉకారమునకు, నస్యాత్ -సంధి లేదు. రక్షించుపంబ, పోషించుపీశ్వరి, వర్తమానవిహితస్య=వర్తమానార్థమందు చేయంబడ్డ, చేః=చువర్ణమునకు, వా స్యాత్ =వికల్పమున సంధివచ్చును. నగుచిట్లనియె, నగుచు

నిల్లనియె, తదాదిజస్య=తచ్ఛబ్దాద్యర్థములయందుఁ బుట్టిన ఇకారమునకు, తద్వత్=చూకు (చుకారమునకు) వలెనే వికల్పము (సంధి వచ్చును) అదియె వ్వరు; అదెవ్వరు, ఇది యేమి, ఇదేమి; కిమాదికస్య=కిమర్థాదులయొక్క, ఇతస్తు=ఇకారమునకైన, ప్రాయః=తఱచుగా, స్యాత్=సంధికలదు. ఏమన్న, ఏమయ్యా, ఏమందు. ప్రాయః అన్నాఁడు, గనుక యేమియన్న యనియును గలదు.



అపిశబ్దార్థస్యేత శ్చారే రుపధాత్మనశ్చ లు గ్వా స్యాత్
శత్రర్థేతూఁతశ్చానో స్తస్య స్యాచ్చ పూర్ణబిన్దు రపి. ౩

ఇది మూఁడుసూత్రములు. అపిశబ్దార్థస్య ఇతః- అపిశబ్దార్థస్య=అపి యను నుపసర్గార్థపదముయొక్క, ఇతః=ఇకారమునకు, వికల్పమున లోపము వచ్చును, మారునే నంబనే, మారునేని నంబనేని. చారే రుపధాత్మనశ్చ లు గ్వా స్యాత్. కొనయక్షరమున కీతలనుండెడిది ఉపధ, ఉపధాత్మనః=ఉపధారూపమైన, రేః=రి అను నక్షరమునకు (రివర్ణసంబంధి యైన యికారమునకు) చౌ=చి యనున క్షరము పర మగుచుండఁగా- లుక్ వా స్యాత్=ఇకారమునకు వికల్పమున లోపము వచ్చును. అమర్చి, అమరిచి. శత్రర్థేతూఁతశ్చానోః- శత్రర్థే=వర్తమానార్థమందు, చౌ=చువర్ణము పరమై యుండినచో, నోః=నుకారముయొక్క, ఉతః=ఉకారమునకు, వికల్పమున లోపము వచ్చును, తస్య=మిగిలిన యానకారమునకు, పూర్ణబిందు రపి=నిండుబిందువును, స్యాత్=అగును. వినుచు, వించు; అనుచు, అంచు. 'బిందు రపి' యని యపిశబ్దము పెట్టినందుచేతఁ గొన్నిచోటుల రాదు. చనుచు, ఎన్నుచు, పూనుచు, ఇత్యాది.



శబ్దా త్తచ్ఛబ్దాతః పోశ్చ తదాద్యర్థవాచకే ష్వాతః
ప్రథమావిభక్తికయో ర్బిందుశ్చ మహాఁ ప్రతిక్రియార్థేతు. ౪

శబ్దాత్ తచ్ఛబ్దాతః=శబ్దమునీఁద నుండు తచ్ఛబ్దార్థము యొక్క, అకారమునకు వికల్పమున లోపము వచ్చును. బాఁపనది, కోమటిది. బాఁపనయది, కోమటియది. తదాద్యర్థవాచకేషు=తదా యనెడి మొదలైన శబ్దార్థములు పలికెడువానియందలి, పోః=పు అనునక్షరముయొక్క, ఉతః=ఉకారమునకు, వికల్పమున లోపము వచ్చును, అపుడు, అప్డు; ఇపుడు, ఇప్డు, ఇత్యాది.

పత్లృ గతౌ అను ధాత్వర్థము పరమైన- ప్రథమావైభక్తిక=ప్రథమావిభక్తి రూపమైన, మోః= ము అను నక్షరమునకు వికల్పమున లోపము, మహాన్ బిందుశ్చ=లోపము రానిచోట పూర్ణబిందువును- భయపడి, భయంపడి; సంకటపడి, సంకటంపడి. ఇత్యాది.

---

**షష్ఠ్యా ఉతో౽చి నుమ్సే చాద్యస్యామ్రేడితే త్వన్త్యలోపశ్చ**
**అహామాదీనాం ద్విత్వం లోపో నమఆదికే విసర్గస్య. ౫.**

ఇది నాలుగు సూత్రములు. షష్ఠ్యాః ఉతః అచి నుమ్ సే-ప్రాకృతశాస్త్రవ్యవహారమున స అనిన సమాసము. సే=సమాసమందు, ఉతః=ఉకారముయొక్క, షష్ఠ్యాః=షష్ఠికి, అచి=అచ్చుపరమై యుండిన, నుమ్=నుమ్ అను నాగమము వచ్చును. ఆగమాదేశాదిలక్షణములు శబ్దశాస్త్రవ్యవహారముననే తెలియునది. "అనుక్తమన్యవత్" అనుప్రాకృతన్యాయమున నుమ్‌లోని ఉకారమకారములకు శబ్దసూత్రముచేత లోపము చేయునది. రాజునెదుట, పామునెమ్ములు. ఆద్యస్య ఆమ్రేడితే అంత్యలోపశ్చ, ఆమ్రేడిత మనఁగా రెండుమారులుచ్చరింపఁబడు శబ్దము. దానియందు, ఆద్యస్య=మొదటిదానికి, అంత్యలోపః=అంత్యలోప మగును. అన్నన్న, ఏమేమి, ఓహోహో, ఇత్యాది. అహామాదీనాం=అహం మొదలైనవి, యనుకరించునప్పుడు వాని యంత్యమునకు, ద్విత్వం=ద్విత్వము వచ్చును. సున్నకు ద్విత్వము రానేరదు గనుక మకారము చేసికొనునది. అహమ్మని, కిమ్మని, ఝుమ్మని. లోపః నమ ఆదికే విసర్గస్య, నమ ఆదికే=నమః అనునవి మొదలైనవి యనుకరించునప్పుడు వానియందలి, విసర్గస్య=విసర్గకు, లోపః=లోప మగును. నమోనమ యని, ధర్మస్సహాయ యని.

---

**పరుషా ద్రుతప్రకృతికా త్సరళా స్స్యు స్తద్రుతంచ బిందుస్స్యాత్**
**అవికారగతే తస్మిన్నపి సరళా ఏవ సన్తి తే పరతః. ౬.**

ఇది రెండు సూత్రములు. ద్రుతప్రకృతికాత్=ద్రుతప్రకృతిమీఁద నున్న, పరుషాః=కచటతపలు, సరళాః స్యుః=గజడదబ లౌను. తద్రుతంచ=ఆద్రుతప్రకృతియొక్క నకారము, బిందుః స్యాత్=సున్న యౌను. నినుఁదలంతు, ననుఁగావు. హ్రస్వపరము గనుక పూర్ణమును నౌను. నినుందలంతు, ననుంగావు. దీర్ఘపరమైన లేవు, నేఁగొలిచితి, తాఁగొను. తస్మిన్=ఆనకారము, అవికారగతేపి=బింద్వాదిరూపము గాకపోయినను,స్వభావమున నున్ననుగాని, పరతః=

మ. స్మరజిద్భక్తిరసాంబుపూరితము శ్రీమన్మానసావాలమం
దురహీ స్నిపదపల్లవాంకురము సంతోషంబుతో నిల్పి సు
స్థిరముం జేసిన దాన ముక్తిఫల మర్థిం గాంతు రాసేర్పు చూ
పరు లెంచ న్పెదనాభిధానశివపూర్వస్వామ్యగస్త్యేశ్వరా. ౧౬

మ. నరులుం గిన్నరులు న్మునీశ్వరులు నానానిర్జరు లగ్గాడిసం
దిరుగం బాఱునె లోకసంతతియు, సాధింపంగ నోనే నిర
త్తురకుశ్రీంభరు లెందఱైన నొకశాస్త్రజ్ఞుండు వాదించు దు
ర్భరయుక్తిం బెదనాభిధాన. ౧౭

మ. సమయాచార్యుఁడ వీవు శిష్యుఁడ సహస్రం బేను సత్యం బవ
శ్యము నన్గావఁగ దాత వీవరయ యుష్మద్భక్తిభాగ్యంబు ని
త్యముగాఁగఁ భువి మించుఁ దద్యశము చేత న్మించు నీమూర్తి త
త్త్వమయంబై పెదనాభిధాన. ౧౮

మ. నరసం బీఘటమందిరంబునను సుజ్ఞానాఖ్యదీపాంకురం
బురులీల న్వెలిఁగింపఁ జేయుట సురవ్యూహప్రధానుండ వై
దొరవై చీఁకటియింట నుంట తగ దెందుం జూడ నీవే పరా
పరమేశా పెదనాభిధాన. ౧౯

మ. నిజమే నీవు జగద్గురుండ వనుచో నేఁ జేయు పాపంబు లే
దెపుడైనం గలదేని యెందు వని నిన్నే శిష్యపాపం గురో
రపియ న్వాగ్గతి నే నిరాఘుఁడ నిర............ధ
ర్మపరుల్ శ్రీపెదనాభిదాన. ౨౦

శా. అంభోబింబఫలాధరేశ్వర శిరస్సాష్టాంగదండప్రణా
మం బే నిప్డు ఘనత్వ సంత తభిరామం బెన్న శేదెందు ని
త్యం బేఁ జేసినతప్పు లన్నిటికి డాయన్రావె సుజ్ఞానదీ
పంబీవే పెదనాభిధాన. ౨౧

మ. మును దారాపతి దక్షశాపహతి నింపుం బెంపుఁ బోనాడి కూ
లిన వానిం దగ నెత్తి నెత్తి నిడి పాలింపంగ నిత్యాశ్రితుం
డను నిర్దోషిని నీదుకాళ్లకడ నైనం జేర్చి రక్షించు టొ
ప్పని దేనా పెదనాభిధాన. ౨౨

మ. గృహాశల్యంబులు గూల్చి కట్టిన మరుద్గేహంబున న్నీదు వి

గ్రహము స్థావము నుంచి మ్రొక్కలిడువార లెవ్వండి సెల్లొడ్డి ప్ర
త్యహము న్నిన్నడఁగట్టి పూజలిడు వార్ స్తవ్యాత్మలే లోకధూ
ర్వహ నీ కో పెడనాభిధాన. ౨౩

మ. హరుఁ డన్నన్ హిమవద్ధరాధరమనోహారీకుమారీమనో
హరుఁ డన్నం ద్రిజగచ్చరాచరశిరఃప్రాంచచ్చరన్నృత్యసం
హరుఁ డన్న న్నలి శంకరుం డనఁగఁ నీవంచున్ భజింతుం బరా
త్పరుఁ డన్నం బెడనాభిధాన. ౨౪

మ. ఒకపూఁ టన్నము లేనివాని కెటు నోరూరంగ మున్నూలు తిం
టకుఁగా నొక్కట్టఁ బంచభక్ష్యములు నింటం గల్గు నేవెంట నిం
చుక గల్గించిన నీదయారస ము కెంచున్ దాన నానావనీ
పకకల్పా పెడనాభిధాన. ౨౫

శా. శ్రీనాథాబ్జభవేంద్రముఖ్యదివిషచ్ఛ్రేణీమహోద్యన్నన
స్థానా వర్ధిరమండవస్థగితవజ్రస్తూపవిద్యుత్ప్రభా
జ్ఞానాజ్ఞానతమోవిరామ విమలజ్ఞానాత్మవిద్యానవ
ధ్యానాంచత్పెడనాభిధాన. ౨౬

శా. ఏకాలంబు జగత్కుటుంబభరణం బేకాకినై యోర్తు విం
తే కాదా భువనైకమాత యనురక్తి న్నాయనై యున్నచో
నీ కింతైన భరింపవచ్చు నిది వాణీరాజ్ఞికి న్నశ్యమా
వాక్రువ్వం బెడనాభిధాన. ౨౭

శా. లోకానీకములోన దేహియనువాలో నాస్తియన్రాదు ము
న్నీకుం గట్టఁగ బట్టలేదు మఱి నిన్నే నెంత యాచించిన
న్నాకే మీవల దందు కిందొసఁగు నానందింతు నీభక్తియు
న్నైకంబే పెడనాభిధాన. ౨౮

శా. వేదార్థంబుల నిందు నీతనుమహద్విఖ్యాతి నిత్యంబుగా
నీదంబోయినఁ ద్రావనీళ్లు మఱి లే వెందన్న చందంబు ని
న్నాదిం జూడఁగ నేమి లేదు జగదాద్యం బెన్న నీవంచు నే
వాదింతుం బెడనాభిధాన. ౨౯

శా. అన్నా చిత్రము నీదు వైభవము నీవా వస్తువైశ్వర్యసం
పన్నాధ్యుండవు చేఁదుబువ్వ పులితో లైపచీరయుం బూదిమే

గ్గన్నా చిచ్చగు నెమ్మనమ్ము నినుఁ గన్నం జాలు నీకల్మిమే
ల్వన్నెరా పెదనాభిధాన. ౩౦

శా. అన్నా ము న్వలపించె నేర్పొసర ని న్నాపార్వతీదేవి నీ
కన్నం జక్కనివాఁడు లేఁడనుచు ని గ్గాదించి మోహించి ము
న్నెన్నో నోములు నోఁచి దాన సగ మయ్యె న్నీదుమే న్దారసం
పన్నం బై పెదనాభిధాన. ౩౧

మ. అనుమానం బొక యింత లేదు నగవీా నై పోతి నీవున్న దూ
పావరం జెప్పినఁ బౌరుషంబు నగనై రయ్యెప్పా రె నీజాడఁ జూ
డ నిజంబాడిన నిష్ఠురంబు వెనువెంట న్వచ్చు నాకేల నీ
పనియింతే పెదనాభిధాన. ౩౨

శా. తల్లిం గానక తండ్రిపే రెఱుఁగ కా తన్వీలలామంబె మే
లిల్లు న్వాకిలి తోడునీడ యని నీపెక్కింపఁ దప్పక్తి నీ
వెల్ల న్నీ వని లోఁ గనుంగొనియు నింకేమైన నందున్న దే
పల్లెత్తం బెదనాభిధాన. ౩౩

మ. రసన న్నేల నమోక్తు లెంత ప్రియమారం జెప్పినం బ్లుకు
న్నవదాస్థాఁబుఁడ వంటి ని ట్లనుట లై నా గానరా నైతి విం
తసిధారా వ్రత మైన మంచిదనరాదా యిక్కడే యింత యా
రనమేలా పెదనాభిధాన. ౩౪

మ. జలగంధాక్షతపత్రపుష్పచయరాజద్ధూపదీపాదులం
గలకాలంబు నినుఁ బ్రభజించి నుతుల న్గావించి మెప్పించి లో
కులు నీయిల్లు గడంగి చూఱగొన నీకు న్భిక్ష గొల్లెగా
వలసెంగా పెదనాభిధాన. ౩౫

శా. నీ వెందున్న సమస్తసంపదలు ముందే వేఁడి కొన్నంతలోఁ
గా వే యిచ్చి గణాధినాథులకొడల్ నై సేసి తద్భూతిచే
నావేశించి తిరింగ దబ్బెదల నీ యౌచిత్యమే యింతగా
రావించెం బెదనాభిధాన. ౩౬

శా. అయ్యయ్యో విష మేల తింటి వది నీ కాహార మెట్లయ్యె నా
నయ్యా కుత్తుకబంటి యున్నయది యట్లైన న్భయం బేమి నా
కుయ్యాలింపు సనాతనుండ వికఁ నీకుం జేటు రాదెప్పు నా

పయ్యాసనం బెడనాభిధాన శివపూర్వస్త్యాద్యగస్త్యేశ్వరా. ౩౭

మ. శ్రమియింపందగు నెన్నఁబూనిన వశక్యం బస్మదీయాపరా
ధము లెన్నైన విడంగ నేన నిజసంతానం బదెంతెంత త
ప్పొ మదింగూర్చినఁ గన్నతండ్రి మది నీ మోదంబు లోకాహిత
ప్రమదంబో పెడనాభిధా. ౩౮

మ. ధనదప్రాణపదంబు నీరజవసంతానంబు నీపాదద
ర్శనమైతే నదిగల్గుటే యరిది గాంచం గల్గిన న్లోకమే
లనగుం బెన్నిధిఁగన్న పేద కిఁక నేలా చింతిలం గోర్కి నీ
రనుతింతుం బెడనాభిధాన. ౩౯

మ. నుతియింపం గడ గాన లేరెవరు నిన్నున్ ధాత ని న్నీదు వి
శ్రుతరూపంబు గణింప లేక చతురాస్యుం డయ్యె శేషుం డధో
గతిపాలయ్యె శ్రుతు ల్చికాకుపడియె న్గా నీమహత్త్వంబు శా
శ్వత మయ్యెం బెడనాభిధాన. ౪౦

మ. జగతిం బుట్టినదాదిగాఁ గుటిలసంసారాంబుధిం ద్రోచి స
వ్వగలన్ దొంగతనంబునం దిరుగు టోర్వంజాలఁ దచ్చౌర్య మీ
నిగమాంతర్గత మాడు పట్టుపడి తేనిన్ భక్తిబంధించి నా
పగకీస్తుం బెడనాభిధాన. ౪౧

శా. ఆబాణాసురుఁ డేమియుండిడెనో నీకాయింటివాకింటఁ గా
పై బంట్లైయుంట నాయువము నాయందున్న నాలోవనా
శాబంధంబున నుండు మీవు దొరనై సర్వంబు సందేహమే
ప్రాఁబట్టు ల్పెడనాభిధాన. ౪౨

మ. కరుణాంతఃకరణంబు నీదనుచు నేఁ గాంక్షింప నిండార్తిశే
షరిగాఁ జూచెద వింతె చాలు నది ముం జత్రాతిరాముగ్ధుఁగాఁ
తురిసయ్యాటల గట్టిదేటినది యందుం గట్టిగా దే దయా
వరణంబై పెడనాభిధాన. ౪౩

మ. ప్రమథాధ్యక్ష మహోక్షసైంధవ జగద్బంధో దయాసింధ వేం
దుమణిస్ఫాటికసన్నిభాంగరుచయే తుభ్యం నమో దేవదే
వ మహాదేవ దృఢప్రభావ చిదచిద్వ్యాపార మాంపాహి స
ర్వమనోద్యత్పెడనాభిధాన. ౪౪

మ. అనభిజ్ఞోన్మదభాగ్యగర్వచలనోద్యద్విస్మృతు ల్బాల్యయౌ
వనకౌమారజరాంతకాలముల సంప్రాప్తంబు లిందాక్షవే
శ నినుం బ్రస్తుతిసేయఁగందు వని యేలా యుందు నందున్న నీ
వని విందు న్బెడనాభిధాన. ౪౫

శా. నానాశాస్త్రపురాణవేదపఠనానందం బదెంతైన వి
జ్ఞానం బన్నది లేక వేఁడిన విశేషం బేమి బోధింప వి
జ్ఞానం బద్దములోనఁ జేకు గనునాదందంబు వన్నెంచు నీ
వానింగాఁ బెడనాభిధాన. ౪౬

శా. జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలను నీసంసారమూహింప స
త్యగ్రం బ్బుక్కట దుఃఖభాజనముగం దుత్సాహముం బొందు భా
వగ్రంథి న్నశలించి ప్రోవు మని విన్నాపించితిన్నాదె మ
... ... ... ... ... ౪౭

మ. సిరి దాఁజేరినఁ జేరుఁగాక జనరాశిన్ ధర్మకీర్తిద్వయం
స్థిర మన్పద్ధతి రెండుదప్పు మఱి యేదీ మర్త్యలోకంబునం
దరయన్ శాశ్వత మన్న దింకొకఁడు నీయందమ్యు సర్వం బవాం
తరలీల న్బెడనాభిధాన. ౪౮

శా. శ్రీమంతుండవు భక్తబాంధవుఁడ వున్మృత్యుప్రస్తార్థసీమా మహో
ద్దామా బిడ్డలఁ గన్నతండ్రి వెడ నిర్దాక్షిణ్య మింతేల యో
స్వామీ నీశరణాగతుండ నిఁక నాపైఁగూర్మి రానీ శివా
వామాంగా పెడనాభిధాన. ౪౯

శా. ప్రాలేయాచలకన్యకా ప్రియ భవత్పాదారవిందార్చనా
లోలుండై హరి నేత్రపద్మమునఁ దద్భక్తిశ్రీ గాఁ బూన్చి త
త్కాలోచిత్యము దీర్చి కాంచెఁ గద నీకారుణ్యముం దా జగ
త్పాలుండై పెడనాభిధాన శివపూర్వస్వాద్యగస్త్యేశ్వరా. ౫౦

శా. ఆర్యాలోల మదీయవర్తనము సవ్యంబైనఁ గాకున్న నౌ
దార్యప్రక్రియ కేమి లోపమగు నర్థప్రాణము ల్రెండు నా
చార్యాధీనములే కదా తుదకు నీసందేహముం దీర్ప దు
ర్వార్యంబా పెడనాభిధాన. ౫౧

శా. ఏ నిన్నున్మతి నమ్మినందుకు మదీయేష్టార్థసంసిద్ధి నీ

చే నేనాఁటికి నా నిదేమి పనిగాఁ జిత్తంబునం దోఁచె ని
ష్ఠనం బ్రాణము లైదు నీకొసఁగి నీయం దైక్యమేఁ గాంతునా
రా నీతి న్బదనాభిధాన. ౫౨

శా. పూర్వజ్ఞానము లేనివాఁడ నను సంబోధించి వేవేగ మ
ద్గర్వంబంతయుఁ గూల్చి భక్తినిరతుం గావించి రక్షింపవే
సర్వాభీష్టఫలప్రదాత వయి నాసావ్వదిగా కృపాదృష్టినిఁ
బర్వ శ్రీపదనాభిధాన. ౫౩

శా. నీనామస్మరణంబె పావనముగా నిష్ఠం బ్రవర్తించు వి
జ్ఞానాత్ముండు కృతార్థుఁ డౌటరుదె దుశ్చారిత్రుఁ డైనం గళా
హీనుం డైనను ముక్తుఁ డౌఁ బరశివా యే త్వత్కరాంతస్సుధా
పానాప్తిం బెదనాభిధాన. ౫౪

శా. నీనామ్రాండవు దప్ప నన్నఱఁగి మన్నింపంగ వేఱొక్కరుం
డేవంకం గలఁ డయ్య నామొదలకేఁ డేవంక నీవింక న
న్గావంగాఁ దగుఁ బంకజాక్షులను బాంధవ్యంబు నిత్యంబె నం
భావింపం బెదనాభిధాన. ౫౫

శా. నీసౌందర్యముఁ జూచి మోహినియునై నీకేశకస్త్రీత్వంబుం
జేసైరింపక మున్ను మౌనివనవాటిం గూడె నిన్నన్నపే
రాన ల్వానటనై నటింప మునిభార్య ల్గాసి సేవించుటే
త్రాసంబా పెదనాభిధాన. ౫౬

శా. కైలాసం బనిశంబుఁ జేరుఁ సుమహత్కాండంబు నాహారప
జ్జాలంబుం గనతోడునీడలయి నీజాడం బ్రవర్తింతు రా
లాలిత్యంబు విచిత్ర మందు నిను నేలాగంను నీక్కొనక
జేతానా పెదనాభిధాన. ౫౭

శా. కాదే రోగికి మృత్యుసన్నిహితమై కప్పట్టునావేళ నా
నాదివ్యౌషధమంత్ర తంత్రముల నానావత్ర్వహారంబు నా
నాదిప్రాప్తశివాత్మరద్వయి నదే నల్లవ్వ డీఁగాంతు నీ
పాదంబు న్బదనాభిధాన. ౫౮

మ. తనకుం గల్గి గలంతకాల మెపుడున్ దానంబు ధర్మం బటం
చును బుద్ధింతయు లేక తాక్కొనిన దుర్దారిద్ర్యముం జంత నే

సిననేహా నది శైల మేదినతుషిం జింతింప దీవ్యత్ప్రభో
వనమూనా పెదనాభిధాన. ౫౯

మ. మును గావించిన పుణ్యలేశమున నేమో కూడుటే గాని స
ద్వినియోగంబున కందరాని ధన మన్వేషింపనొ గాక చో
రనరేంద్రాజ్ఞలచేతఁ దక్కు నన నర్థప్రాప్తికి న్వట్టిక
ల్పన గాదే పెదనాభిధాన. ౬౦

మ......హితకంఠభూషణము రం గుల్కెటి తద్వల...
గణనం బైనవధూశిరోధి నెపలంగా ధర్మరాహిత్యమై
గుణముంటం దలకొన్న భాగ్యము దొలంగుంగాక సంధిల్లునా
ఫణిభూషా పెదనాభిధాన. ౬౧

శా. ధర్మం బర్జునభూమిభృత్తిలక మే తద్ధర్మకర్మం బన
ర్ఘర్మపూర్వహానికృంతనం బగుట సాధ్యంబన్న నీ కింతకుఁ
ధర్మంబన్నది యున్నఁ గాచికొను దథ్యం బాద్యదేవా ప్రభా
వర్మం బే పెదనాభిధాన. ౬౨

మ. అలసన్న్యాసికి లేదు తస్కరభయం బాభీతి సాన్మన్నవా
రలకే వారిది లేమిగా దది దరిద్రప్రాణులంబైన ని
శ్చలమౌ భక్తిధనంబుకల్మి ధనికు ల్పత్యం బదే నాపద
ల్పలగొన్నం బెదనాభిధాన. ౬౩

మ. అతిలోభిం గనుఁగొన్న యాచకజనం బాకాంక్షమై సర్వసం
తతి యార్జించు నె దాతలం గనిన పేదల్పంగి నీదర్శనో
న్నతి నింపొందు సమస్తభాగ్యసుభకందం బిందుకందేటి సం
ప్రతిమూడ న్పెదనాభిధాన. ౬౪

శా. శిష్టాచారము లేల గ ల్గనుచి కీర్తింపంగ యావజ్జనో
చ్ఛిష్టగ్రాహికిఁ గల్గునట్లు రుచి భక్షింపంగ నీ రెండుఁ జెం
దస్టైశ్వరసమిద్ధభోగి కిల నీ యాశీర్వచఃప్రాభవా
వ్యష్టిఁ శ్రీపెదనాభిధాన. ౬౫

శా. ఇంటింటం జని వంటకంబు గొనలే కట్టుంగాఁ బెంటలో
కంటం బంటను బట్టి గీరికొని సాయంబైన కాకంబులా
యుంటుంటం బెయిపీచుచు న్మనఁగు నిత్యాశాసుచిగ్రాహి ని

...టూనా పెదనాభిధాన శివపూర్వస్త్వాద్యగస్త్యేశ్వరా. ౭౬

మ. కలకాలంబు గురూపదేశ విదితజ్ఞానంబులే కాత్మచం
చలమై విస్మృతిఁ జెందునప్పు డెదలో శంకించుమూఢుండు దాఁ
గలుపజ్ఞార్ణలకుక్షితాఖ్య మనుసంజ్ఞం దెల్పె ముందున్నదే
ఫలమింతే పెదనాభిధాన. ౭౭

శా. నీసద్భక్తివిహీనులై తిరుగు దుర్నీతు ల్మతి న్మోహుల
ర్త్నీసాంగత్యము గాంతురే నిజము గాసిందప్పి చింతిల్లకన్
భాసిల్లం గలదే యనాథలకు సౌభాగ్యంబు తత్సంగతి
ప్రాసంబై పెదనాభిధాన. ౭౮

శా. బాలక్రీడల కల్లమూల మగు సంభావించి యూడించు నీ
లీలామానుషవిగ్రహంబు విధికేళి న్నిల్పుఁ జాలించినం
గీలూడం బడు జంత్రపుం బ్రతిమమాడ్కిం గ్రాలు నీచేతగుం
బాలింపం బెదనాభిధాన. ౭౯

శా. తోఁడేల్గన్న మృగంబులట్లు మది.........
లాడింపంగ నెఱుంగలేక యము డాయంబోవు మర్త్యాళికిం
జూడం జుట్టము ముక్తిదైవము మదిన్ శోధింప నీకంటె న
న్వాఁడీవే పెదనాభిధాన. ౮౦

మ. సకలాధర్మతరంగసంగతము సంసారార్ణవం బందుఁ బాం
థికగా మత్తిలి యున్న చిత్త మనురక్తిం జేసి వైరాగ్యమా
ర్గకభావ్యక్తి నెఱుంగ నీఁగకును సౌగంధ్యంబు సొంపొన ద
ర్పకభంగా పెదనాభిధాన. ౮౧

శా. ఎందుం దోడయి నిల్చియుండఁ దరి నీవెందున్న నీయందె నా
డెందం బిందుకు నందియుంబువల దుండౌ స్వవ్యత్వత్పాదమిం
పొంద న్మట్టుచు భావచేసెద నిదే యూహింప నీకాళ్యరుల్
బందం బౌ పెదనాభిధాన. ౮౨

మ. ధరఁ బుట్టింపఁ గరంబుఁ జెంప ననుసంధానంబు గావింప నే
ర్పరివై సర్వ మనుగ్రహింప ననుఁ బ్రోవన్నీ కసాధ్యంబె యిం
దరవిందప్రభ చిత్రభానున కనాహ్లాదంబె నాతంత్రి నీ
వరవుండం బెదనాభిధాన. ౮౩

శ్రీరస్తు.

# ఆంధ్రసాహిత్యపరిషత్తు—కాకినాడ.

## (TELUGU ACADEMY.)

## ప్రమోదూతనామసంవత్సరకార్యనివేదనము.

## (1930—31.)

ప్రమోదూతసంవత్సరముతోఁ బరిషత్తునకుఁ బందొమ్మిదిసంవత్సరములు గడచినవి. ఎప్పటియట్టులు, అపూర్వగ్రంథముద్రణాది విషయములఁ దనశక్త్యనుసారము భాషాసేవ యొనర్చుచున్నది. ప్రారంభమునుండి సలక్షణమగు నాంధ్రభాషయందునసే గ్రంథాదులు రచింపవలయు ననియు నవియే పాఠశాలలయందు బాలురకు నేర్పవలయు ననియునే యీపరిషత్తుయొక్క ముఖ్యోద్దేశము. పరిషత్సభ్యులును బత్రికాపాఠకులును సాయపడినయెడల నింతకంటె నెక్కుడు భాషాసేవ చేయుటకుఁ బరిషత్తు పూనుకొనియున్నది.

—। నిఘంటునిర్మాణము ।—

శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటు నిర్మాణకార్యనివేదనమును బ్రథమానుబంధమునఁ జూడనగును. అచిరకాలమునఁ బ్రథమభాగమును బాఠకలోకమున కందఁజేయు ప్రయత్నములు జరుపఁబడుచున్నవి. ఈకార్యము పిఠాపురములో జరుగుచున్నది.

—। సభ్యులు, చందాదారులు ।—

గతసంవత్సరమునఁ బరిషద్యావజ్జీవసభ్యులు 17 గురు. సాధారణసభ్యులు 57 గురు. గౌరవార్థసభ్యులు 34 గురు. చందాదారులు 106 గురు. ఈసంవత్సరమున యావజ్జీవసభ్యులు 16 గురు. సాధారణసభ్యులు 44 గురు. గౌరవార్థసభ్యులు 31 గురు. చందాదారులు 102 గురు.

—। పత్రికాప్రకటన, గ్రంథప్రకటనము ।—

యథాప్రకారముగ భాషకత్యంతోపకారకములగు గ్రంథములు పత్రికయందును వేఱుగాను బ్రకటించుచుంటిమి. అనంతకవికృతమగు రసాభరణము, చిన్నయసూరికృతములగు సంస్కృతసూత్రాంధ్రవ్యాకరణము, ఆంధ్రశబ్దశాసనమును బ్రకటింపఁబడినవి. చిన్నయసూరి హరికారికలం జూచి బాలవ్యాకరణ

మును రచియించె ననువాదము పునర్విమర్శనీయము. వెన్నెలకంటి అన్నయ్య విరచితమగు షోడశకుమారచరిత్రమునందుఁ గొంతభాగమును బ్రకటించితిమి. గ్రంథ మసంపూర్తిగ నున్నది. 2, 5, 6, 7, ఆశ్వాసములుమాత్రమే లభించినవి. పాఠకులెవ్వరైనఁ దగుప్రయత్న మొనర్చి మిగిలినగ్రంథభాగమును సంపాదించినయెడలఁ బ్రకటించెదము. ప్రజోత్పత్తివత్సరమున నీగ్రంథమందలి 6 వయాశ్వాసశేషమును, 7 వయాశ్వాసమును బ్రకటించి గోపరాజకృతద్వాత్రింశత్సాలభంజికల నారంభించెదము. ఈరెండుగ్రంథములును మృదుమధుర శైలిగలవి. వర్ణనలు తక్కువ, కథాభాగ మెక్కువగనుండి చదువువారికాహ్లాదముం బుట్టించుచుండును. ఇట్టిగ్రంథము లాంధ్రమున బహువిరళములుగ నున్నవి. మఱియును, ఎలకూచి బాలసరస్వతి రచియించిన యాంధ్రశబ్దచింతామణివ్యాఖ్య (బాలసరస్వతీయము) ను బ్రకటింతుము. చింతామణికారునిసూత్రములపై నభిప్రాయభేదము గలదు. నన్నయరచించెనా యను విషయ మటుండఁ బండితులకుఁ గొన్నిసూత్రములలో సంశయము లింకను గలవు. చింతామణికారుని మూలసూత్రముల యభిప్రాయము నెఱుంగుటకు బాలసరస్వతీయ మత్యంతోపయోగముగ నుండును. పరిషత్పుస్తకభాండాగారము, శతకసముచ్చయము, వీనియందలి తక్కినభాగములు పత్రికయందుఁ బ్రకటింపఁబడును. రంగప్పరాజకృతమగు సాంబోపాఖ్యానము ముద్రించుట కారంభించియున్నారము. పత్రిక యిదివఱలో రెండునెలల కొక్కసారి వెలువడుచున్నది. మాసపత్రికగ మార్చుటకుఁ బ్రయత్నము చేయుచున్నారము. ఈసంవత్సరమునఁ బ్రకటింపఁబడిన వ్యాసములను ద్వితీయానుబంధమునఁ జూడనగును. పరిషత్సభలోఁ జదువఁబడిన వ్యాసములే కాక యితరములగు ననేకవ్యాసములు గద్యపద్యాత్మకము లిందుఁ గలవు. తత్కర్తలకుఁ బరిషత్తు మిగులఁ గృతజ్ఞతఁజూపుచున్నది. ఇంతవఱకుఁ బరిషత్తు ప్రకటించిన గ్రంథములపట్టిక 3 వ యనుబంధమునఁ జూడఁదగును.

—) పుస్తకభాండాగారము (—

పరిషత్పుస్తకభాండాగారము దినదినాభివృద్ధి నొందుచున్నయది. పలువురు భాషాభిమానులగు గ్రంథప్రకాశకు లొసంగినవియుఁ గొనినవియు, గతవత్సరాంతమున ముద్రితప్రతులు 2631 ను, తాళపత్రగ్రంథములు 4527 ను గలవు. ఈసంవత్సరమున ముద్రితగ్రంథములు 2847. తాళపత్రప్రతులు. 4585.

ఈసంవత్సరమునఁ గొనిన ముద్రితప్రతులు 25, ఉచితముగ వచ్చినవి 191. వినిమయముగవచ్చు పత్రికలను నాలవయనుబంధమున నిచ్చియుంటిమి. మన పరిషత్కార్యనిర్వాహక వర్గాధ్యక్షు లగు జయంతి రామయ్యపంతులుగారు, ఈ సంవత్సరములోఁ గొన్ని వ్రాఁతప్రతుల నొసంగిరి. అందు, కాకతీయ వంశావళి, కొండవీడు కైఫీయతు, కొండవీడు దండకవిలె, నందవరీక చరిత్రము, గుంసూరురాజుల చరిత్రము మున్నగు చారిత్రకగ్రంథములు గలవు. వానినిగూడ నవకాశమునుబట్టి యపుడపుడు పత్రికలోఁ బ్రకటింప యత్నించెదము. మైసూరు బరోడా దొరతనములవా రొసంగిన గ్రంథములు కొన్ని యమూల్యములు గలవు. పూసర్ల నారాయణరావునాయుఁడుగా రాంధ్రాంగ్లేయగ్రంథము లనేకము లొసంగి వారి యౌదార్యమును భాషాభిమానమును వెల్లడించిరి.

అనేకులు చరిత్రాంశములను, ప్రబంధవిషయములను బరిషద్గ్రంథములనుండి పరిశీలించుకొనుటకు వచ్చుచుందురు. వినిమయముగా వచ్చు పత్రికలనేగాక పాఠకుల యుపయోగమునకై చందాయిచ్చి హిందూ, మోడర్న రివ్యూ, ఓరియంటలురిసెర్చి పత్రికలుగూడఁ దెప్పించి యుంపఁబడుచున్నవి.

—। ఆయవ్యయములు ।—

ఆయవ్యయములపట్టిక యిందు వెనుకనే చేర్పఁబడినది. కాకినాడ పురపాలకసంఘమువారు యథాప్రకారముగ నీయేఁడును రు 200 లు విరాళము నొసంగిరి. పరిషదార్థికస్థితి సరిగ లేదు. చేయఁ బ్రారంభించిన పనులకే చాలినంత రాఁబడి లేదు. చేయవలసినది విశేషముగనున్నది. విరాళముల నొసంగి పోషకులుగను, యావజ్జీవసభ్యులుగను, చందాదారులు గను, చేరి దేశోపకారమునకై శ్రమపడు నీపరిషత్తునకు సాయపడి పరిషత్కార్యములను నిర్విఘ్నముగఁ గొనసాగించి భాషకును దానిమూలమున దేశమునకును మేలు చేసి కీర్తి వహింతు రని సంపన్నులగు విద్యాధికులను, భాషాభిమానులను గోరుచున్నారము.

కిళాంబి రాఘవాచార్యులు,
వింజమూరి వెంకన్న,
కార్యదర్శులు.

—

## ఆంధ్రసాహిత్యపరిషత్తు - కాకినాడ, ప్రమోదూతనామసంవత్సరము (1-4-1930

| ఆయము. | రు. | అ. | పై. | రు. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|
| సంవత్సరాదిని కార్యస్థానమునందిలువ | | | | 33 | 6 | 8 |
| ఇంపీరియల్ బ్యాంకి కరెంటు అక్కౌంటులోనిలువ | | | | 9 | 15 | 11 |
| బ్యాంకిలో ఫిక్స్‌డ్ డిపాజిట్టు వాపసుతీసికొన్నది | | | | 2000 | 0 | 0 |
| చందాలు:— సాధారణసభ్యులు | 200 | 8 | 0 | | | |
| పత్రికచందాలు | 191 | 11 | 0 | 392 | 3 | 0 |
| విడిసంచికల విక్రయము | | | | 8 | 4 | 0 |
| బ్యాంకినుండి వచ్చినవడ్డీ | | | | 957 | 7 | 0 |
| వి. పి. పోస్టేజీ | | | | 21 | 15 | 0 |
| రిజిస్ట్రరుపోస్టేజీ | | | | 1 | 8 | 6 |
| చిల్లరజమ | | | | 1 | 8 | 0 |
| ప్యాకింగు కాతా | | | | 0 | 4 | 6 |
| పుస్తకవిక్రయము:— | | | | | | |
| విప్రనారాయణచరిత్రము | 2 | 8 | 0 | | | |
| కవిజనాశ్రయము | 58 | 13 | 6 | | | |
| జ్యోతిశ్శాస్త్రసారము | 0 | 8 | 0 | | | |
| యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము | 1 | 14 | 0 | | | |
| నీతిసీసపద్యశతకము | 0 | 10 | 0 | | | |
| సర్వేశ్వరశతకము | 0 | 3 | 0 | | | |
| చంపూరామాయణము | 107 | 0 | 0 | | | |
| కావ్యాలంకార చూడామణి | 10 | 10 | 0 | | | |
| ప్రాకృతభాషోత్పత్తి | 0 | 12 | 0 | | | |
| చంద్రభానుచరిత్రము | 4 | 8 | 0 | | | |
| రెడ్డిరాణి రెండుశాసనములు | 0 | 4 | 0 | | | |
| శివతత్త్వసారము | 11 | 4 | 0 | | | |
| శివరాత్రిమాహాత్మ్యము | 11 | 5 | 6 | | | |
| ఆర్యభాషావిభాగము | 0 | 8 | 0 | | | |
| మన్నారుదాసవిలాసనాటకము | 0 | 7 | 0 | | | |
| నారసింహపురాణము | 263 | 5 | 0 | | | |
| జైమినిభారతము | 213 | 11 | 6 | | | |
| కాళిందీకన్యాపరిణయము 1 వ భాగము | 6 | 8 | 0 | | | |
| కాళిందీకన్యాపరిణయము 2 వ భాగము | 0 | 14 | 0 | | | |
| ఆంధ్రధాతుమాల | 2 | 2 | 6 | | | |
| శాసనపద్యమంజరి | 0 | 12 | 0 | 693 | 8 | 0 |
| | | | | 4120 | 0 | 7 |

సంII మొదలు 18-3-1931 సంIIరం వఱకు) ఆయవ్యయముల లెక్క.

| వ్యయము. | రు. | అ. | పై. | రు. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|
| బ్యాంకి చిల్లరవ్యయము | | | | 2 | 12 | 0 |
| వి. పి. పోస్టేజి | | | | 22 | 13 | 6 |
| పండితుల ప్రయాణవ్యయము | 6 | 2 | 0 | | | |
| ఉద్యోగుల ప్రయాణవ్యయము | 53 | 2 | 6 | 59 | 4 | 6 |
| చేబదుళ్లు తీర్చివేసినది | | | | 1000 | 0 | 0 |
| పత్రికావ్యయము:— కాగితము | 292 | 6 | 2 | | | |
| ముద్రణము | 370 | 2 | 0 | | | |
| పోస్టేజి | 100 | 14 | 6 | | | |
| చిల్లరవ్యయము | 2 | 14 | 0 | 766 | 4 | 8 |
| బ్లాకులు బొమ్మలు | | | | 27 | 6 | 0 |
| కార్యస్థానము నిలువలోనుండి ట్రాన్సుఫరు చేసినది. | | | | 8 | 14 | 0 |
| ఇతరముద్రణము, బైండింగు | | | | 93 | 13 | 0 |
| పుస్తకభాండాగారము:— కొనినపుస్తకములు | 23 | 8 | 0 | | | |
| ప్రతులు వ్రాయించుటకు | 54 | 8 | 0 | | | |
| చిల్లరవ్యయము | 7 | 0 | 6 | 85 | 0 | 6 |
| కొనినసామానులు | | | | 33 | 14 | 0 |
| ఉద్యోగులజీతములు | | | | 1038 | 12 | 6 |
| చిల్లరపోస్టేజి | | | | 38 | 9 | 6 |
| రిజిష్టరుపోస్టేజి | | | | 17 | 8 | 0 |
| కార్యస్థానము చిల్లరవ్యయము | | | | 23 | 10 | 9 |
| కలములు కాగితములు | | | | 12 | 10 | 6 |
| ఆడిటరుఫీజు | | | | 25 | 0 | 0 |
| పత్రికలకు చందాలు | | | | 59 | 8 | 0 |
| గ్రంథప్రకటనము | | | | 667 | 2 | 1 |
| కార్యస్థానమున నిలువ | | | | 39 | 3 | 2 |
| బ్యాంకికరెంటు అకౌంటులో సంవత్సరాంతమున నిలువ | | | | 97 | 13 | 11 |
| | | | | 4120 | 0 | 7 |

యనమండ్ర గణపతిరావు,
యఫ్. సి. ఆర్. ఏ. (గ్లాసుగో)
(ఆడిటరు)

కిడాంబి రాఘవాచార్యులు,
నిడుమూరి వెంకన్న,
కార్యదర్శులు.

# 1 వ అనుబంధము.

## శ్రీసూర్యరాయాంధ్రనిఘంటునిర్మాణము.

### ప్రమోదూతసంవత్సర కార్యనివేదిక.

తత్సమపదములు "ప"వర్గమువఱకును అయిన వనియు, తత్సమేతర పదములందు "ట"కారాదిపదము మొదలు "పొగడు" అను పదమువఱకును విమర్శనము జరిగిన దనియు, నిఘంటుసంపాదకులు చేయు పునర్విమర్శనము "అ"కారము మొదలు "ఎ"కారాదిపదమువఱకు జరిగినదనియు నిరుటి నివేదికలోఁ బ్రకటింపఁబడినది.

తరువాత, తెలుఁగుపదములు "పొగడు" మొదలుకొని "బయలు" వఱకును, "మ" మొదలు "మచ్చరించు" వఱకును పండితులచే విమర్శింపఁబడినవి.

"ఎ"కారాదిపదములు మొదలు "ఒ" కారాదిపదములవఱకు నిఘంటుసంపాదకులచేతఁ బునర్విమర్శనము జరుపఁబడినది. ముద్రణమునకిచ్చుటకై అకారాదిపదములచివర పరిశోధనము నిఘంటుసంపాదకులచేఁ గావింపఁబడుచున్నది. అజాదిపదములన్నియు నిట్లు పరిశోధింపఁబడినపిమ్మట నవి నిఘంటు ప్రథమసంపుటముగా ముద్రింపఁబడును.

ఈ సంవత్సరమున నిఘంటునిమిత్తమైన వ్యయము.

| | | | రు. అ. పై. |
|---|---|---|---|
| జీతములు | ... | ... | 3,333- 0- 6 |
| ఇంటియద్దె | ... | ... | 41-15- 0 |
| చిల్లరవ్యయము | ... | ... | 57- 0- 9 |
| | మొత్తము | ... | 3,432- 0- 3 |

జ. రామయ్య.

# 2 వ అనుబంధము.

పరిషత్పత్త్రికలోఁ బ్రకటింపఁబడిన వ్యాసాదులును గ్రంథకర్తలును.

1. అచ్యుతరాయలెవ్వరు—విద్యాప్రవీణ బులుసు వేంకటరమణయ్యగారు.
2. కవితాశక్తి—శతావధాని దోమా వేంకటస్వామిగుప్తగారు.
3. మారుతిస్తవరాజము—శతావధానులు రామకృష్ణసీతారామకవులు.
4. కవిదర్పణచ్ఛందము—పక్కి వేంకటనరసింహకవి.
5. నలకీర్తికౌముదీ—అగస్త్యః.
6. పరిషత్పుస్తకభాండాగారము
7. రసాభరణము—అనంతకవి.
8. షోడశకుమారచరిత్రము—వెన్నెలకంటి అన్నయ్య కవి.
9. సంస్కృతసూత్రాంధ్రవ్యాకరణమ్—చిన్నయసూరి.
10. కన్నశతకము, తేరపావనశతకము.
11. అలంకారములు, స్వభావోక్తి—విద్యాప్రవీణ బులుసు వేంకటరమణయ్యగారు.
12. మిత్రప్రబోధము—కవితావినోద, అల్లంసెట్టి అప్పయ్యగారు.
13. సంస్కృతదూతకావ్యోత్పత్తివికాసములు—ఈయుణ్ణి వీరరాఘవాచార్యులుగారు.
14. సుబ్రహ్మణ్యశతకము—బృహత్తటాకం నాగశాస్త్రి.
15. పాలకురికి సోమనాథకవి, కులగోత్రప్రశంస—బంగారు తిమ్మయ్యగారు.
16. పెద్దన నీతిపరుఁడు—న్యాపతి కృష్ణారావుగారు, బి. ఏ., బి. ఎల్
17. గుణితసూత్రములు—చిన్నయసూరి.
18. మీనాక్షీశతకము—తూములూరి వేంకటరంగకవి.
19. ఆంధ్రసాహిత్యపరిషద్వార్షికసభ.
20. ఆహ్వానసంఘాధ్యక్షోపన్యాసము-అక్కి వేంకటరామయ్యగారు
21. కాళిందీకన్యాపరిణయము-ద్వితీయభాగ పీఠిక. శ్రీపాద పాపయ్యశాస్త్రిగారు.
22. ఆంధ్రశబ్దశాసనము-చిన్నయ సూరి.
23. విభవశుక్లసంవత్సరముల కార్యనివేదనము.

24. పరిషద్వార్షికసభ, అధ్యక్షోపన్యాసము- చిన్నాప్రగడ భానుమూర్తిగారు బి.ఏ.
25. శ్రీజయాదిత్యుని నాఁటి బెళగాం తామ్రశాసనము.
26. మందలింపు—తి. వ. నారాయణస్వామిగారు.
27. మురారి, అనర్ఘరాఘవము- పిలకా గణపతిగారు.
28. ఉత్తరరామ చరిత్ర నాటకరసవిచారము-జయంతి రామయ్యపంతులుగారు.
29. గ్రంథస్వీకారము.
30. దిఙ్నాగాచార్యుని కుందమాల- మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు,
31. కవితాప్రపంచము—విద్వాన్ కోపల్లె శివకామేశ్వరరావుగారు.
32. పోతనభక్తి, భాగవతరచన—జనమంచి శేషాద్రిశర్మగారు.
33. నాఁటిబుధలోకసందర్శనము. కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు.
34. రసాభరణభూమిక—విద్వాన్ కోపల్లె శివకామేశ్వరరావుగారు.
35. పరవస్తు చిన్నయసూరిగారు.

---

## 4 వ అనుబంధము.

పరిషత్పత్రికకు వినిమయముగావచ్చు పత్రికలు.

1. దినపత్రిక. ఆంధ్రపత్రిక—చెన్నపురము.
2. వారమునకు రెండుసారులు:—సమదర్శిని—చెన్నపురి.
3. వారపత్రికలు—
   కృష్ణాపత్రిక—బందరు.
   త్రిలింగ—చెన్నపురము.
   రవి—కాకినాడ.
   యుగంధర—ఏలూరు.
   ఐంద్రావతి—కర్నూలు.
   మంజుభాషిణీ—(సంస్కృతము)—కంచి.
   నివేదన—కాకినాడ.
4. పక్షపత్రికలు—
   పంచానన—సోంపేట.
   శైవప్రచారిణీ—వరంగల్.
5. మాసపత్రికలు—
   అభినవసరస్వతి—జానపాడు.
   భారతి—చెన్నపురము.
   సంస్కృతసాహిత్యపరిషత్పత్రిక—కలకత్తా.
   ఆంధ్రవైద్య సమ్మేళనపత్రిక—ముక్త్యాల.